Regd. No.
H. NL. 18
సంపుటి: 56
సంచిక: 41

# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

11-10-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# ఎం.పి.లు జారిపోతారని 'అన్న' బెంగా?

దేశ రాజకీయాలలో ప్రస్తుతం అందరి దృష్టిని ఆకర్షిస్తున్న అకాలీదళ్ పార్టీని, అస్సాం విద్యార్థి సంస్థ 'అసు'ను కేంద్రంపైకి రెచ్చగొట్టి భారతదేశం పార్టీ స్థాపనకు మార్గాన్ని సుగమం చేసుకోవాలని తెలుగుదేశం నాయకులు ప్రయత్నిస్తున్నారు. కేంద్రంతో ఒప్పందం కుదుర్చుకున్న అకాలీదళ్ ఘనవిజయం సాధించగా, 'అసు' కూడా ప్రాంతీయ పార్టీగా అవతరించి ఎన్నికలలో విజయం సాధించేందుకు సమాయత్తమవు... పార్లమెంటరీ పార్టీ నాయకుడు శ్రీ పి. ఉపేంద్ర. పంజాబ్‌లో 'అకాలీదళ్' విజయం తర్వాత మెరుపులాగా దేశమంతా వ్యాపిస్తూ భారతదేశం పార్టీ ఏర్పాటు గురించి తిరిగి ప్రచారం ప్రారంభించాలని తెలుగుదేశం వర్గాలవారు తెలిపారు. అకాలీదళ్ విజయం సాధించిన మరుక్షణమే ఉపేంద్ర రామారావు అభినందన సందేశాలు పెళ్ళాయి. మరే కాంగ్రెసేతర ప్రతిపక్ష నాయకులు కూడా ఊహించనంత వేగంతో

తెలుగుదేశం ఎన్నిప్రయత్నాలు చేసినా అకాలీదళ్, అసు ఆ పార్టీలతో సహకరించి కేంద్రంతో ఘర్షణపెట్టుకునే అవకాశాలు తక్కువని జాతీయ ప్రతిపక్షనాయకుడొకరు వ్యాఖ్యానించారు. కేంద్రం సహకారం లేకపోతే అకాలీలు పెరగజాలరని అదేవిధంగా అస్సాం విద్యార్థిసంస్థ పరిస్థితికూడా అంతేనని ఆయన పేర్కొన్నారు.

1984లో రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు వచ్చేసమయంలో పెట్టుకోవచ్చునని ముఖ్యమంత్రికి ఆయన హితులు సన్నిహితులు చెప్పారు. ఆ లోపున పరిపాలనలో సమర్థవంతంగా మెలిగి రాష్ట్ర అవసరాలను సాధించుకోవాలని సూచించినందువల్ల పార్టీ వాయిదాపడింది. అయితే అకాలీదళ్ 'అసు' విజయాలు చూసిన తర్వాత పార్టీని వెంటనే ప్రారంభించాలని ముఖ్యమంత్రి తిరిగి తొందరపడుతున్నట్లు తెలుస్తున్నది. పంజాబ్ అస్సాం ఒప్పందాల తర్వాత శ్రీ రాజీవ్‌గాంధీ ప్రతిష్ఠ మరింత బాగా పెరిగిపోయినందున ఇప్పుడు పార్టీ ప్రారంభించడం ఆత్మహత్యాసదృశ్యమని శ్రీ రామారావును ఆయన సలహాదారులు హెచ్చరిస్తున్నారు. కాని పార్టీ వెంటనే ప్రారంభించాలని ఆయన ఆరాటపడడానికి ఆసక్తికరమైన మరొక ముఖ్యకారణంకూడా ఉందని అంటున్నారు. దేశరాజకీయాలలో తక్షణమే పునాదిని వేసుకోవడం ప్రారంభించాలనే ఆలోచనతోపాటు, శ్రీ రాజీవ్‌గాంధీ పనితీరు, వ్యక్తిత్వంపట్ల రోజురోజుకు ఆకర్షితులవుతున్న తెలుగుదేశం పార్లమెంటరీ సభ్యులను తిరిగి తనవైపుకు తిప్పుకోడానికి పార్టీని వెంటనే స్థాపించడం అవసరమని ఆయన అనుకుంటున్నట్లు చెబుతున్నారు. తెలుగుదేశం



'దేశం' సంచార రాయబారి
ఉపేంద్ర

ఎం.పి.లకు మరెవ్వరికీ లభించనంత ముఖ్యంగా కోరినదేతడవుగా ఢిల్లీలో ప్రధాని ఇంటర్వ్యూలు లభిస్తున్నాయని

—తరువాత 7 వ పేజీలో

## 'భారతదేశం' స్థాపన ఆరాటానికి ఇదా అసలు కారణం?

...కున్నది. పంజాబ్ అస్సాంలతో రాజకీయ చతురతతో ఒప్పందం కుదుర్చుకుని దేశసమగ్రతకు ప్రమాదకరంగా పరిణమించిన అక్కడి ఉద్యమాలను చల్లార్చడంతో ప్రధాని రాజీవ్‌గాంధీ ప్రతిష్ఠ ఒక్కసారిగా ఆకాశమంత ఎత్తుకు పెరిగింది. ఆయన తర్వాత దేశ ప్రజల దృష్టిని ఆకర్షిస్తున్నది కేంద్రంతో జయప్రదంగా ఒప్పందం కుదుర్చుకున్న అకాలీదళ్‌పార్టీ, అసు సంస్థ లేనని రాజకీయ వర్గాలవారు పేర్కొంటున్నారు.

**మా హైదరాబాదు విలేఖరి**

పెరుగుతున్న శ్రీ రాజీవ్‌గాంధీ ప్రతిష్ఠకు భయపడి భారతదేశంపార్టీ ఏర్పాటును తాత్కాలికంగా వాయిదా వేసుకున్న తెలుగుదేశం నాయకులకు ప్రాంతీయ శక్తులతోకూడిన 'అకాలీదళ్', 'అసు' విజయం తర్వాత తిరిగి ఆశలు తలెత్తాయి. అందువల్లనే తెలుగుదేశం పార్లమెంటరీ... ఉపేంద్ర ప్రమాణస్వీకార ఉత్సవానికి పంజాబ్ వెళ్ళిపోయారు. అక్కడ ముఖ్యమంత్రి బర్నాలాతో కలిసి చర్చలు జరిపారు. అకాలీదళ్, తెలుగుదేశంపార్టీ సిద్ధాంతాలు ఒకటేనని రెండూ రాష్ట్రాలకు స్వయంప్రతిపత్తిని కోరుతున్నాయని విలేఖరుల గోష్ఠిలో ఉపేంద్ర ప్రకటించారు. ఆయన ప్రకటనను రాజకీయ వర్గాలవారు విడ్డూరంగా పేర్కొంటున్నారు. దేశరాజకీయాలలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించేందుకు అకాలీదళ్‌ను పంజాబ్ ఎన్నికలలో గెలిపించేందుకు కాంగ్రెస్ (ఐ) తాను బుద్ధిపూర్వకంగా ఓటమిని కొనితెచ్చుకొన్నదనే విషయం ఉపేంద్రకు తెలియదా అని ప్రశ్నిస్తున్నారు. సున్నితమైన పంజాబ్ సమస్యను కొత్త ఒరవడితో పరిష్కరించే ప్రయత్నాలు అమలు జరుగుతున్నప్పుడు కేంద్ర రాష్ట్రసంబంధాలు అనే పాతపక్క వివాదంతో అకాలీదళ్‌ను రెచ్చగొట్టడానికి ప్రయత్నించడం సబబు కాదని రాజకీయపరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు.

...లలో తిరిగి ఘనవిజయం సాధించిన తర్వాత, భారతదేశం పార్టీఏర్పాటు ఆలోచన శ్రీ రామారావు బుర్రను తొలిచివేసింది. అయితే ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రతిష్ఠ అప్పట్లో బాగా ఉన్నందువల్ల ఇప్పుడు భారతదేశం పార్టీ ఏర్పాటుచేసి లాభమేమి. పెడితే తిరిగి పార్లమెంటు

# జమీన్‌రైతు

## సోమశిల ఆవశ్యకత

సోమశిల ప్రాజెక్టు నిర్మాణం నెల్లూరు జిల్లా ప్రాంతానికి ఎంత అవసరమో, డెల్టాకు అది ఎంత ప్రాణప్రదమో ఏటేటేటికీ వెనుకకు పోతున్న వాతావరణ పరిస్థితులు చాటిచెప్తున్నాయి.

నెల్లూరు జిల్లా అంటే పచ్చ్యాకుపచ్చనైనదనే భ్రమ ఒకటుంది. నెల్లూరు, కోవూరు తాలూకాలలోని కొంతభాగం సంగం- నెల్లూరు ఆనకట్టల క్రింద పంటలలో సాగవుతూ, రైతులకు బస్తాలలో పోసే వరిధాన్యం ప్రాంతం వారికి పచ్చగా కనపడుతూ, జిల్లా అంతా ఈ విధంగానే కళకళలాడుతుంటుందేమోననే పొరపాటు అభిప్రాయాన్ని కల్గిస్తుంటుంది. పెన్న డెల్టాలో రెండు లక్షల ఎకరాలకు మించి సాగుకావు. జిల్లాలోని తక్కిన ప్రాంతమంతా రాయలసీమ- తెలంగాణాలకంటే అధ్వాన్నమైనదని తెలియదు.

నెల్లూరు, కోవూరు ప్రాంతాలు పచ్చగా కనపడడానికి కారణం వుంది. పెన్నకు పుష్కలంగా ప్రవాహం వచ్చేది; జులైలోనే వచ్చేది; ఒక్కోమారు నెంబరులోపాటు కూడా తగ్గకుండా, ఎడతెగకుండా పారుతూ రోడ్డు బ్రిడ్జి లేకుండా కేవలం నెల్లూరు పక్కనున్న ఆనకట్టపై ఏకైక రోడ్డు మార్గం అయినప్పుడు రోడ్డు రవాణా బంద్ అయిపోయేది; నెల్లూరు నుండి కోవూరుకు పోవాలన్నా రైలే గతి. ఏట్లో ప్రవాహం ముందుగా రావడం, పుష్కలంగా దీర్ఘకాలం ప్రవహించడం వల్ల అరుద్రకార్తెలో (జులై-ఆగస్టు) మొలగొలుకు నాట్లు పూర్తి అయిపోయేవి. అటువంటిది ఇప్పుడు అక్టోబరులైనా నాట్లు చురుగ్గా ప్రారంభం కావడం లేదు; కొన్ని సంవత్సరాలలో అయితే మొలగొలుకు పేరంటు అవకాశమే లేకుండా పోతున్నది.

ఈ సంవత్సరం విషయం తీసుకున్నా- ఇప్పటివరకే పేరు ప్రారంభమైనా హస్తకార్తె పోతున్నా వర్షం లేదు; పెన్నలో నీళ్ళు లేవు. వర్షము-ఏరు ఒక్కసారి వస్తాయి; నాట్లకు అందరూ ఒక్కసారి దిగుతారు; మనుషుల కొరత, కూలిరేట్లు ఆకాశానికెగయడం; తీరా అష్టకష్టాలు పడి, మితిమీరిన ఖర్చులు భరించి నాట్లువేయడం; అక్టోబరు చివరనో- నవంబరు ప్రారంభంలోనూ పెనుతుపానురావడం పైపైరు పూర్తిగా కొట్టుకు పోవడం....శాశ్వతమైన ఈ శాపంతో రైతు అంగారిపోయాడు. వ్యవసాయ కృషి దాస్యశృంఖలాల నుండి విముక్తికై వేయిదేవుళ్ళకు మొక్కు తున్నాడు.

సోమశిల ప్రాజెక్టు వుంటే రైతుకు ఈ దుర్గతి పట్టేదికాదుగదా! ప్రాజెక్టుకు శంకుస్థాపన జరిగి, జూన్ 4 నాటికి సరిగ్గా పదేళ్ళు పూర్తి అయ్యాయి; నిర్మాణానికి ఐదారు మాసాలు తర్వాతైనా అంకురార్పణ జరిగి వుండాలి. ప్రాజెక్టు రెండుదశలకు కలిసి అనాటి అంచనా మున్నూట ముప్పయిమూడు కోట్ల యాభైలక్షల రూపాయలు; డ్యాం ఎత్తు 380 అడుగులనుకుంటాము; తర్వాత మారిందేమో తెలియదు.

అటువంటిది పదేళ్ళుగడిచినా పూర్తికావడానికి మరో ఐదేళ్ళు పడుతుందంటున్నారు మేజర్ ఇరిగేషన్ మంత్రి కె. ఇ. కృష్ణమూర్తి డ్యాం ఎత్తు 86 మీటర్లు కావలసింది 81 మీటర్లే అయినదంటున్నారు; ఇప్పటికి 65 కోట్ల 22 లక్షలు ఖర్చుకాగా, మరో 81 కోట్ల 78 లక్షలు అవసరమంటున్నారు ఆయన. ఈ ప్రాజెక్టుకు ఏటా మొక్కుబడిగా జరుగుతున్న కేటాయింపులను బట్టి గతానుభవాన్నిబట్టి ఇది ఏదో పదేళ్ళకైనా పూర్తి అవుతుందనే నమ్మకం లేదు; ఎవిమిదో వ్రణాళిక గడచినా ఆశ్చర్యం లేదు. అట్లనే వ్యయం 88 లక్షల 55 వేలన్నది ఇప్పటికే రెట్టింపు అయింది; ఇంకా 81 కోట్లు అవసరమవుతున్నదంటే నిర్మాణంలో జరుగుతున్న అలక్ష్యాన్ని బట్టి ఆ మొత్తమూ రెట్టింపైనా అనుకోవలసిన పనిలేదు.

సోమశిలకోసం ఆందోళన చేసిన పెద్దలు గతించారు; దాని శంకుస్థాపన శుభవార్తను చెవిన వేసుకున్న ఈ తరంవారూ వెళ్ళిపోయేవరకు సోమశిల పూర్తికాదేమోననిపిస్తున్నది. సోమశిల ప్రాజెక్టు నిర్మాణాన్ని త్వరితపరచాలని జిల్లా ప్రజానీకం నిష్పం తీర్మానించింది; అక్కడితో కావడంలేదు. అసెంబ్లీలో సోమశిలనుగూర్చి నిలదీసే అడిగాడు తీర్మానాలతో సోమశిల తొందరగా పూర్తికాదు; రైతుల బాధలు తీరవు. దానికి శాంతియుతంగానే తీవ్రమైన ఆందోళన కావాలి; దానికి రైతాంగం ముందే పూను కోవాలి. అప్పటివరకు కోవూరు - నెల్లూరు డెల్టాగతికూడా ఇంతే!

---

## జమీన్‌రైతు

**11-10-1935**

### మంటలార్పే బాంబులు

మంటలార్పే బాంబులు లండనులో క్రొత్తగా కనిపెట్టబడినవి. తగులబడిన భవనముపై ఈ బాంబును వేసిన క్రేని అందుండి గ్యాసు బయల్వెడలి మంటలార్పివేయును.

### గుంటూరులో స్వదేశీ సిగరెట్ల కంపెని

గుంటూరునందు హిందూస్థాన్ టొబాకో కంపెనీలో సిగరెట్లు తయారు చేయుటకు 5 లక్షల మూలధనముతో కంపెని ప్రారంభించుటకు శ్రీయుతుల మాచేటి శ్రీశైలం, పావలాలు కంపెనీవారు మానేజింగ్ డైరక్టర్లుగా నియమించుటకు ఏర్పాటు చేయబడినది.

3 అణాలు రొట్టపూకూలి

రాష్ట్రములోనూ పనివారికి పగటిపూట మూడణాలు కూలి ఇవ్వవలెనని అక్టోబరు 11 తేదీన వార్ధాలో జరుగు అఖిలభారత చరఖా సంఘ సభలో మహాత్ముడొక తీర్మానమును ప్రతిపాదించును.

### వెంకటగిరి దివాను

రావుబహదూర్ పామగంటి శ్రీహరి

## 50 ఏళ్ల క్రితం ఈవారం

రావుబహదూర్ వారిని తిరుగ వెంకటగిరి దివానుగా నియమించిరను విడుగు వంటి మద్రాసు మెయిలు వార్త నమ్మలనే విర్హాంతపరిచినది; వెంకటగిరి రైతులనెంత కలవరపెడుచున్నదో చెప్పజాలము.

మద్రాసు ప్రభుత్వము రాష్ట్రమునందలి పర్యాయం 8 సంవత్సరములు వరుసగా వుండి రైతులకు చేసిన అపకారములు ఇంకకొన్ని తరములు మనుభవించినను తరుగునవి కావు.

### పొగాకుపై పన్ను

పొగాకుపై చేయబడు వ్యవసాయంపై పన్నును విధించుటకు మద్రాసు ప్రభుత్వమువారికి నొకబిల్లు రాబోవు శాసనసభయందు ప్రవేశపెట్టబడును.

### తీర్థంపాడు గోవిందురెడ్డి అరెస్టు వారెంటు

గోవిందురెడ్డి చిత్తూరుజిల్లాలో ఎవరికో దాకియుంటే అకవిషల్లి ఎస్టేటువారు లోపాయికారి అరెస్టుమెంటు చేసుకుని పితలకరం గోవిందురెడ్డిగారికి అరెస్టువారంటుపెట్టి, రైతులను మెసలకుండా చేయుచున్నారు. అందువల్ల ఇతనికి వైద్యమునైనను చాలానష్టమైనది. —

---

# పారిశ్రామికాభివృద్ధి గగనకుసుమమేనా?

నెల్లూరుజిల్లా పారిశ్రామికంగా వెనుకబడి వుందని ప్రతిఒక్కరూ, వేదికలెక్కినవ్వుడల్లా చెప్తుంటారు. కాని ఈ లోపాన్ని నివారించి జిల్లాను అభివృద్ధి చేయడానికి మాత్రం ఎవరూ కృషి చేయడంలేదు; పరిశ్రమలను పూనుకోవడంలేదు.

ప్రభుత్వం ఏ పరిశ్రమ నెలకొల్పినా విజయవాడకో, హైదరాబాదుకో, తిరుపతికో కేటాయిస్తుంది. కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలుకూడా అంతే! దీనికి ఈ మూడు ప్రాంతాలు పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందాయి. హైదరాబాదు పటాన్‌చెరువు, హర్యానాలోని ఫరీదాబాద్‌ను తలపింపచేస్తుంది. ఈ ప్రాంతాల్లో విశేషంగా లభించే ఖనిజాలు, గిరిజాలుకూడా లేవు. రవాణా పదుపాయాలు తప్ప, మరొక ప్రత్యేకతకూడా లేదు.

నెల్లూరు విషయంలాగాదు. మైకా ముస్నపురాయి, సిలికాన్, క్వార్ట్జ్ వంటి ఖనిజాలు అనేకం ఈజిల్లా అపారంగా లభిస్తున్నాయి. వాటిని ఆధారం చేసుకొని పలుపరిశ్రమలు అభివృద్ధిచేసే అవకాశం వుంది. రోడ్డు రైలు, రవాణాలో మనం వెనుకబడిలేము. కృష్ణపట్నం ఓడరేవు జిల్లాకు ఒక వరం.

నెల్లూరుజిల్లాకు అన్నీవున్నాయి. కానీ అనావశ్యకత అనేది మన నాయకులలో బాగావుంది. నాయకులు, మంత్రులు, శాసనసభ్యులు పట్టుదలవహిస్తే, కొత్తపరిశ్రమల ఏర్పాటు ప్రతిపాదన వచ్చినప్పుడు, అది నెల్లూరుజిల్లాకు ఇచ్చితీరాలని భీష్మించుకుని కూర్చుంటే, ప్రభుత్వం చిన్నచూపు చూడలేదు! మనలో ఆ శ్రద్ధలేకుండబట్టే ఈ దుర్గతి. ప్రభుత్వం పెద్దపరిశ్రమలు నెలకొల్పితే పైపైవేలు వ్యక్తులుకూడా వారంతటవారు ముందుకువస్తారు.

వల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు, అన్నిట్లో అనావశ్యకత చూపినా ఈ విషయంలోనైనా జిల్లాకుమేలుచేస్తే కలకాలం ఆయనపేరు నిలుస్తుంది.

సంగం —జి. వాసు

### జనవాణి

#### జవహర్ భారతిలో చరిత్ర రద్దు

కావలి జవహర్ భారతి కాలేజీలో ఎనిమిదేళ్ళనుంచి అమెరికన్ హిస్టరీ, ఫార్ ఈస్ట్ ఏసియన్ హిస్టరీలు బి.ఎ. లో సబ్జక్టులుగా వుండేవి. ఈ రెండింటికో విద్యార్థులు ఒకదానిని ఎంపిక చేసుకునే ఛాయిస్ వుండేది.

కాని ఇటీవల ఎందువల్లో ఈస్ట్ ఏసియన్ హిస్టరీని కాలేజి సిలబస్ నుంచి తొలగించారు. దీనివల్ల విద్యార్థులకు తమకువచ్చిన పాఠ్యాంశం ఎంపిక చేసుకునే హక్కు పోయింది.

అధికారులు ఈ విషయం పునర్విచారించి, రెండు చరిత్రలనూ కొనసాగించాలని మనవి.

కావలి —జె. వెంకటరావు

#### దేగపూడి రోడ్డులో స్పీడ్ బ్రేకర్లు కావాలి

పొదలకూరు తాలూకా దేగపూడి చీరోడ్డు కూడలిలో వాహనాల రాకపోకలు ప్రమాదకరంగా వున్నాయి. రాపూరు, గూడూరు, పొదలకూరువెళ్ళే అన్నిబస్సులు, చెల్లటూరు డ్యాంవనిలో తిరిగే భారీవాహనాలు, మైకాగాం అతిరాజం జీపులు, కార్లు, రైస్‌మిల్లుకువచ్చిపోయేబండ్లు, ట్రాక్టర్లతో ఈ కూడలి

-కొరవ 10వ పేజీలో

# ప్రమాదాలు జరగకముందే ఆక్రమణాలు తొలగించండి

నెల్లూరులో ఆక్రమణల తొలగింపు అనేది ఒక ప్రహసనమైపోయింది. ఎప్పుడో ఎవరో 'యూనాదివారు ఏకోరేసి వట్లు' హఠాత్తుగా దుందుడుకుగా విచక్షణ రహితంగా నేంటుకవుతున్న ఆక్రమణంనే కాదు. వే.కి ఎవరికి అర్థంకాని వీథుల్లో అగాగావవున్న రోడ్డుంమనూడా తొలగించడం, వాడకీథత్వం నృష్టించడం. వద్దంశర్గించడం చివరకు ఆక్రమణదారుల హాహాకారాలు, ఏళ్లినాయకుల జోక్యంతో చప్పుండిపోవడం. నాలుగు రోజుల్లో తొలగించబడిన ఆక్రమణలన్నీ యథాస్థానాలను అలంకరించడం. ఈ భాగోతం మామూలైపోయింది.

ఆక్రమణల తొలగింపు అంటే జాయింట్ కలెక్టరుగా శ్రీ హెచ్. కె. బాబు చేసినదే శాశ్వతంగానిల్చిపోయింది. ఆత్మకూరు బస్‌స్టాండువద్ద ఉత్తరంగా ట్రంకురోడ్డు కిరువైపులా, కనకమహల్ సెమ్నుగార్డెన్‌లో పళ్లేవల్లికాల్వ గట్టున షండిక వర్క్‌షాపులు వగైరాలన్నిటినీ బుల్‌డోజర్‌తో నేలమట్టంచేసి రాకపోక వరం. అనాటివరకే ఎమర్జెన్సీ లేదను కోండి; హెచ్. కె. బాబువలెనే వ్యక్తు ఏడుగువంటి జాయింటు కలెక్టరు వున్నారు- శ్రీ దయాచారి. అయన ట్రాఫిక్‌కు ప్రతిబంధకంగా, ప్రమాద

## నెల్లూరు సంగతులు

లను రోడ్డును విశాలంచేశారు. అక్కడొక్కచోట మాత్రమే తొలగించబడిన ఆక్రమణం పునరాక్రమణకు జరగలేదు.

అప్పుడుకూడా టవున్‌లో ట్రాఫిక్ రద్దీగల కొన్ని ప్రాంతాల్లో అటువంటి ఉతినమైనతొలగింపు కార్యక్రమం అవసరంగావున్న ఆక్రమణలు తొలగించగలిగితే టవున్‌కు శాశ్వతంగా మేలు చేసినవారవుతారు.

టవున్‌లో వాహనాల రాకపోకలు అత్యధికంగా కలిగి ఆక్రమణలకు గురియైనరోడ్లు చాలవున్నాయి. కానిఅందులో మరీముఖ్యంగా పేర్కొనదగినవి : అటు మైపాడురోడ్డు; అంటే వవలాక్‌పేట నుంచి ముత్తుకూరురోడ్డు. ప్రప్రథమంగా ఈ రెండుచోట్ల రోడ్డు దురాక్రమణల తొలగింపు ప్రారంభం కావాలి.

ఈ రెండింటికూడా ప్రస్తుతం ట్రాఫిక్ రద్దీలో ముత్తుకూరురోడ్డు మొదటగా వస్తుంది. కృష్ణాపట్నం రేవుకు ఓడ రావడం ఎప్పుడు ప్రారంభమైందో, లారీల రాకపోకలు పెచ్చుపెరిగిపోయాయి. ఆ పెరుగుదల ఒక్కసారిగా రెండుమూడురెట్లు వుంటుంది. కాని పి. డబ్ల్యు. డి. అఫీసువద్దనున్న బ్రిడ్జిసెంటరులో అంగళ్ళు, జాలి నాలి జనం గుంపులు, నాలుగురోడ్ల కూడలి జిడ్ల రాకపోకలు....అదే ఒకపెద్ద "బాటిల్ నెక్". అని దానికే హరినాథపురం పొడవునా రెండుమూడు ఫర్లాంగులవర్యంతం

## అందుకు జాయింటు కలెక్టరు దయాచారి తగినవాడు

రోడ్డుకిరువైపులా రోడ్డులోకి పొడుచుకొని వచ్చివున్న గుడిసెలు పైకప్పుల మొకలు రిమాండవడు రోడ్డే స్థానం. రోడ్లోనే మంచాలమీద విశ్రాంతి; రోడ్డుమీద అన్ను వేసి దానాలు; రోడ్డుమీదనే వృత్తివ్యాపారం అటు; రోడ్డుకు అడ్డంగా అటు ఇటు వచ్చిపోతే పిల్లలు....ఆ రెండు మూడు ఫర్లాంగుల దూరం వాహనాలవారు ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొని పోవలసి వస్తున్నది; నూటికిపోగువాని అటు ఇటు జరిగినా, ఎవరి ప్రాణానికి ముప్పో. ఏ గుడిసెమీదకు ఎక్కుతుందోననే భీతి. ఇదివరకే భయం; లారీ రాకపోకలరద్దీ పెరిగితర్వాత అది గుండెదడగా పరిణమించింది.

ఆ ఆక్రమణలు అట్లావుంటే, ఆ రోడ్డు ఆ విధంగానే అరాచకంగా వుంటే ఎప్పుడో ఏ క్షణంలోనో ఘోరమైన పరిమాదం తప్పదు; అటువంటి విపత్తు జరగకముందే, ప్రాణనష్టం సంభవించకముందే ఆ ఆక్రమణలను తొలగించి, ఆ అరాచకాన్ని అరికట్టడం అవసరం. అదని ఉక్కుహస్తంతో చేయగలిగితేగాని జరగదు.

ఆ పేదవాళ్ళు ఎక్కడకుపోవాల అనే ప్రశ్న వస్తుంది. పేదవారికి ప్రత్యామ్నాయంగా స్థలం చూపించవలసివస్తే వీటి చూపించాలి. కాని పేదవారైనంత మాత్రాన రోడ్లను పీధులను ఆక్రమిస్తుంటే అదిమాత్రం ఎట్లా సమర్థనీయమవుతుంది?




### జైలులో బాపూజీ జయంతి

జిల్లా జైలులో జరిగే గాంధీ జయంతికి ప్రత్యేక ప్రాధాన్యతవుంది, ఆ దినానికి ఒక ప్రత్యేకతను, పవిత్రతను ఆపాదించి ఘనంగా జరుపుకుంటారు. అది ఖైదీల పంచేను ఉత్సవంకూడా.

ఈసారి జయంతి సభకు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ జ్యోతి వెలిగించి సభ ప్రారంభించారు. విడుదలతర్వాత ఖైదీలు, తిరిగి జైలులో అడుగుపెట్టకుండా, తమనుతాము సంస్కరించుకోవాలని కలెక్టర్ కోరారు.

జిల్లాజడ్జి శ్రీ శివసాంబమూర్తి, శ్రీ లవణం, శ్రీమతి హేమలతా లవణం, బిషప్ శ్రీ పి. వి. బాలస్వామి, తదితరులు మాట్లాడారు.

జైలు కాంట్రాక్టరు శ్రీ పి. జనార్దనరెడ్డి ఖైదీలకు ఒక మైకుసెట్ బహూకరించారు. సభకు జైలర్ శ్రీ పి. గురవయ్య స్వాగతం, వంతేనూధికారి శ్రీ రామగోవిందయ్య వందనాలు చెప్పారు. తర్వాత ఖైదీలు 'సేవసెంట్స్' నాటిక ప్రదర్శించారు. ఆటల పోటీలలో గెలుపొందిన ఖైదీలకు శ్రీ కె. వి. సింహాచలం శ్రీమతి నంగనూను బహుమతులు పంచారు.

—కాకర శివ శేఖర్

# శ్రీనివాసులు అంతర్ధానం కేసునే అంతర్ధానం చేస్తూందా పోలీసు?

గూడూరు - కూపిలి శ్రీనివాసులు నాయుడు అంతర్ధానమై నేటికి నాలుగు నెలలా ఎనిమిది రోజులు. అయినా అతను ఏమైందీ ఇంతవరకు తెలియలేదు. ఈ అంతర్ధానానికి సంబంధించి చెప్పదగిన కొత్త విషయమేమీ లేదు. అయినా అడ్వొకేటు శ్రీ వి. మాలకొండయ్య వెలిబుచ్చుతున్న అభిప్రాయాలు వివాదగ్రస్తమవుతూ పునః ప్రస్తావనకు పురికొల్పుతున్నాయి.

ఈ కేసుకు సంబంధించి చెప్పదగిన విశేషమేమీ లేదనడం కూడా పొరపాటే అవుతుంది. ఎందుకంటే తన భర్త జూన్ 3 తేది సాయంత్రంనుండి కనిపించడంలేదని అనుమానాలతో అతని భార్య ప్రకారం ఆ నెల 20 తేది గూడూరు పోలీసుకు రిపోర్టుచేస్తే ఈ నెల 9 తేదీ వరకు తననుగాని, తనబంధువులనుగాని విచారించలేదని ఆమె చెప్పింది. ఒక వ్యక్తి కనబడకుండా పోయి, అతను ఏదైనా అఘాయిత్యానికి గురైవుంటాడేమోనని ఆందోళన చెందుతూ అతని భార్య రిపోర్టు చేస్తే అతని గూర్చి ఫిర్యాదు చేసినవారిని ఇలాకావాలని పోలీసు విచారించనవసరంలేదా? ఇటువంటి సందర్భాలలో పోలీసు ఈ సాంప్రదాయాన్ని పాటించదా? గూడూరు పోలీసుకే ఈ పైని ప్రత్యేకమా? పోలీసుశాఖలోని పెద్ద అధికారులు వివృత్తి చేయవలసిన ప్రశ్నలివి; ఫిర్యాదీనుండి సమాచారం సేకరించివుండవలసిన అవసరం లేదని భావిస్తే గూడూరు పోలీసు ఈవిషయంలో ఎందుకు ఉదాసీనంగావుందో వారే వివరించాలి.

కేసుకు సంబంధించి పోలీసు ఏమి చర్యలు తీసుకుంటున్నారో, దర్యాప్తు ఏ కోణంనుండి జరుగుతున్నదో తెలియడం లేదు. కాని పోలీసు ఈ కేసును వదలి వేయలేదని, దర్యాప్తు కొనసాగుతున్నదని తెలుస్తున్నది. ఈ సందర్భంలో శ్రీనివాసులునాయుడు ఆచూకీ తీయడానికి పోలీసు బృందాలు బెంగుళూరు, విశాఖపట్నంలకు పంపబడి వున్నాయని తెలిసింది. ఆ రెండు చోట్లనుండి పోలీసుకు ఎవరివల్లనైనా సమాచారం వుండి వుండాలి. అటువంటి సమాచారం ఎవరైనా వ్యక్తులు ఇచ్చివుంటే తెలిసి ఇచ్చారో, లేక మరేవుద్దేశ్యంతో నైనా ఇచ్చారో వూహించలేము.

పోలీసు దర్యాప్తు చేస్తున్నప్పుడు దానికి సంబంధించి వూహాగానాలు చేయడం వుచితంకాదు; ఒక్కొక్కసారి నేర విచారణకి ప్రతిబంధకం కావచ్చును; కాని నాలుగు నెలలు గడచిపోయింది. భార్య పిల్లలు, తల్లి దండ్రి గలిగిన ఒక నిండుప్రాణానికి సంబంధించినవిషయం. పైగా దానికిసంబంధించినవారు పూటకో రకంగా అనుమానాలు కలిగేవిధంగా అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. అటువంటప్పుడు వెలిబుచ్చిన అభిప్రాయాలపైన ప్రశ్నార్థకమవుతున్న సందేహాలను వెల్లడించకుండా ఎట్లా వుండగలం?

అడ్వొకేటు శ్రీ మాలకొండయ్యతో ఇంటర్వ్యూ అంటూ ఒక స్థానికపత్రికలో ప్రశ్నోత్తరాల రూపంలో ఒక కథనం వెలువడింది. అందులోని "అవశ్యము, అసంబద్ధమైన" అంశాలకు శ్రీనివాసులునాయుడు భార్య జవాబు వ్రాయవలసివచ్చింది. ఆ ఇల్లాలు ఆవేదన ఈ ఒక్కమాటలో అర్థమవుతుంది- "....నాభర్తకు ఏమి హానిజరిగిందో, వారి ఆచూకీ ఎందుకు తెలియడంలేదో అనే ఆదుర్దాతప్ప ఒకవ్యక్తిని ఏదో నేరంలో ఇరికించాల్సిన అవసరం నాకు లేదు" అంటుంది ఆమె. తోటి ఇల్లాళ్ళకు చెమ్మగిల్లచేసేమాట! ఆమె దివ్యన్న ఆవేదనతో ఇంకో మాట కూడా అంటుంది- "....ఇంటర్వ్యూలో కల్పించి చెప్పిన అబద్ధాలుచూస్తే ఏదో చేయకుండా వుంటే ఇంతగా ఎందుకు భయపడాలి? అంటిసిపేటరీ బెయిల్ ఎందుకు తీసుకోవాలి?" ఇంటర్వ్యూలో మాలకొండయ్య గారు వెలిబుచ్చిన ప్రతి అంశానికి ఆమె వివరణ ఇచ్చింది; స్థలాభావం-ఆ వివరణను ప్రకటించలేము.

### మాలకొండయ్య 'ఇంటర్వ్యూ' రేకెత్తిస్తున్న అనుమానాలు అపోహలు

ఇంటర్వ్యూలో శ్రీ మాలకొండయ్య పదమూడు గూడూరు వాసులు ఏడుగ నాగరాజు, 4వ వార్డు మునిసిపల్ కౌన్సిలరు పేటా కమలయ్యలకు శ్రీనివాసులు నాయుడు వెళ్ళడానికి తాను రు. 300 లు ఇచ్చాననీ; వాళ్ళ తనవద్దకువచ్చి అతను బెంగుళూరులో వున్నట్లు చెప్పారని మాలకొండయ్య వుద్ఘాటించాడు. ఆ నాగరాజు, కమలయ్య లిద్దరూ ఇది అబద్ధ కల్పనని ఖండిస్తున్నారు; ప్రమాణపూర్వకంగానే చెప్పనుంటున్నారు. కమలయ్య తన జవాబులో ఇట్లా అంటాడు" అసలు మాలకొండయ్య నాకుతెలియదు, అయన తెలుసుకోవలసిన అవసరం నాకులేదు" అని స్పష్టంగా అంటున్నారు. ఆగస్టు 17 తేదీ రాత్రి ఇద్దరు పిల్లలు తన వద్దకు వచ్చి మాలకొండయ్య పంపున తాము వచ్చామని చెప్తూ నాగరాజు ఇల్లు అడిగారని, తాను చూపించానని అయన అంటాడు. ఆ ఇద్దరూ వచ్చినపుడు తాము వూళ్లో లేనని, తిరిగి వచ్చిన తర్వాత తనకొరకు మాలకొండయ్య ఈ విధంగా మనుషులను పంపినట్లు చెప్పారని, మరు రోజు నెల్లూరు జిల్లాకోర్టులో తనకొరకు ఎందుకు పంపారని మాలకొండయ్యను అడిగానని, శ్రీనివాసులునాయుడు కొడుకుతో మాట్లాడుతుండినావే ఏమిటని మాలకొండయ్య ప్రశ్నించాడని,

—కొనసాగింపు 8 వ పేజీలో

# మరుగుదొడ్డిగా మారిన రేడియో రూం- కావలి మునిసిపాలిటీ దారుణ నిర్లక్ష్యం!

మునిసిపాలిటీ నిర్వాకం, నిర్లక్ష్యం రోజురోజుకు ఎంతమాత్రం సహించరాదని కావలి పౌరులు హెచ్చరిస్తున్నారు. పదిహేడింట పొందు సెంట్రుకవానిలో చేరారు. ప్రజాసేవాతంగాన్ని మాత్రం వదలలేకుండావున్న యువన్యాయవాది శ్రీ ఎం. వి. నారాయణ వివిధ పార్టీల నాయకులకు, పౌర ముఖ్యులను సమీకరించి ఈ హెచ్చరిక చేశారు.

### జిల్లా వార్తలు

కావలి టౌనులో ఒకసారి కలియ తిరిగితే, అసలు మునిసిపాలిటీ అనేదొకటుందా అన్న సందేహం ఎవరికైనా కలుగుతుంది. నగరంపైగా వీధుల్లో దీపాలు వెలుగవు; రోడ్లంతా గోతులు. బురదతో రోతగా వున్నాయి; నీళ్ళసమస్య ఎప్పటికీ తీరదు.

ఇవికాక, 2 వార్డులో ఒక రేడియో రూం కడితే, అలనా పాలనా లేక అది మరుగుదొడ్డి క్రింద మారిపోయిందట; 11, 12 వార్డుల్లో కాలువలు లేక పోతుగా వీధి రోడ్లోనే పారుతూ, పందులు, దోమలకు నిలయాలుగా వున్నాయట; కావిటింటి నీళ్ళపని అసలు పని చేయడమేలేదట; వీటన్నింటిని అధికారులు దుర్వినియోగం చేస్తున్నారని, ఈ దోరణి మానుకొని పరిపాలనయంత్రాంగం పరిష్కరించడానికి పూనుకోకుంటే, ప్రత్యక్ష చర్యకు; పరిపాలనకు పూనుకుంటామని 6 తేదీ సమావేశమైన అఖిలపక్ష పరిరక్షణ కమిటీ హెచ్చరించింది.

కావలి పౌరుల్లో ఈమాత్రం కదలిక రావడం మంచిదేకాని, ఇది ప్రకటనలకే పరిమితంకాకుండా పరిపాలక సంఘం మెదలువంచే ఆందోళనగా పరిణమిస్తేనే ఫలితం; అదశ్యప్రాయంగామవుతుంది.

### కావలిలో క్రిగ్ పోటీలు

నెల్లూరు జిల్లా క్రిగ్ మెమోరియల్ హైస్కూలు విద్యార్థుల ఆటల పోటీలు డిసెంబరు 2 తేదీ నుండి కావలిలో జరుగుతాయి. వివరాలకు, దరఖాస్తులకు అన్ని స్కూళ్ళ హెడ్మాస్టర్లు కావలి జవహర్ హైస్కూలు ఫిజికల్ డైరెక్టరుకు అక్టోబరు 31 తేది లోగా వ్రాయాలట. జిల్లా క్రీడా సంఘం ఉపాధ్యక్షుడు శ్రీ వి. వి. ఎస్. శర్మ చెప్పారు.

### కావలికి కొత్త ఎం ఆర్ ఒ

కావలి మండల రెవిన్యూ అధికారిగా

—కొనసాగింపు 12 వ పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు
### విమర్శకుడు

### మాగుంట కోటల ముట్టడి!

మూడు రాష్ట్రాలకు తమ వ్యాపార సామ్రాజ్యాన్ని విద్యుత్ వేగంతో విస్తరింపచేసిన్న మాగుంట సోదరులకు చెందిన నెల్లూరు - హైదరాబాదు - విజయవాడ - మద్రాసు - బెంగుళూరులలోని 'కోటల'ను ఆదాయపుపన్ను అధికారులు 9, 10 తేదులలో ఏకసమయంలో పెద్ద 'సైన్య'సమీకరణతో ముట్టడించినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. ఆదాయపుపన్నువారికి అవసరమైన వరుకు ఏమైనా దొరికిందో లేదో కాని, ఒకలారీలోడ్ కాగితాలతో తరలి పోయినట్లు తెలుస్తున్నది.

అంతకు కొంతకాలం క్రితం లిక్కర్ సామ్రాట్టు శ్రీ విజయ్ మల్లయ్య ఇల్లు, సంస్థలమీద దాడిజరిగిందట. అటువంటప్పుడు ఎవరైనా "ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్" గానే వుంటారుగదా!

మాగుంటవారికి సంబంధించి కథలు గాథలు విశేషంగా విస్తృతంగా వ్యాప్తిలో వుంటున్నాయి. అవి ఏ కాశీమజిలీ కథలో, అల్లావుద్దీన్ అద్భుతదీపంగారంకథలో పున్నాయనుకొంది; మాగుంటసోదరులను దానముంచివారనిపేరు; అతిమంచి తనమే ఒక్కొకసారి చెడ్డచేస్తుంటుంది. ఈ మామ్మర్మాన్ని వారు గ్రహించగలిగితే మంచిది.

### రెవిన్యూ మంత్రి

రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి హైదరాబాదులో కంటే నెల్లూరులోనే ఎక్కువగా వుంటున్నారు; ఈనెలలోనే ఇప్పటికి రెండుసార్లు వచ్చి పోయారు; మళ్ళీ 3 విడతగా 12 తేది ఉదయం వస్తున్నారు, 14 తేది సాయంత్రం తిరిగి వెళ్తారు. కార్యక్రమాలేవీ లేవు - లేనివి సృష్టించలేక పాపం కలెక్టరుకు తలప్రాణం తోకకు వస్తూందేమో!

### చిత్తవచ్చినా చినుకులేదు!

గురువారం రాత్రి చిత్తకార్తెకూడా రానేవచ్చింది. కాని చినుకేది?

హస్తలో అక్కడక్కడ మంచి వర్షమే కురిసింది; వాననీళ్ళకోసం నాట్లు వేసిన ప్రదేశాలు కూడా వున్నవన్నారు. కాని అంతటాలేదు; నెల్లూరు చుట్టు ప్రక్కల అసలేలేదు.

గురువారం సూర్యగ్రహణమని దర్శనంలేదు బుధవారం మిదిని ప్రకాశించాడు; కాకినాడవద్ద ఏర్పడిన అల్పపీడన ఆయనకు ఒకరోజు సి. ఎల్. లో పోవడానికి అవకాశమిచ్చింది; శుక్రవారం యధాప్రకారం డ్యూటీలో చేరాడు;

ఏల్లో వంగం అవతలమీద ఒక అడుగు పీడున్నది; పైకెళ్ళు కాదని, సోమశిలకుంచి విడుదలైన నీళ్ళేవీరుగా వుంటుందని చెప్తున్నారు. గురువారం ప్రధానకాల్వలం పారుదల క్యూసెక్కులలో కనిగిరి రిజర్వాయరు 3191, నెల్లూరు 382, కనుపూరు 100, జాఫర్‌సాహెబ్ 313, సర్వేపల్లి 332 క్యూసెక్కులు.

వరిన నాలుగు చినుకులు, కాల్వలకు వచ్చిన కొద్దిపాటి, ఫిల్టర్‌పాయింట్ల సాయంతో మెంగోలుకునాట్లు చిరాకు జనక వాతావరణంలో ముమ్మరంగానే ప్రారంభమయ్యాయి.

### గూడూరుకు కొత్తఛేర్మన్

గూడూరు మునిసిపాలిటికి కొత్త చేర్మన్‌గా శ్రీ కె. ఉదయభాస్కర్ ఎన్నికైనారు. 10 తేది జరిగిన ఎన్నికల్లో ఆయనకు 16, కాంగ్రెసు అభ్యర్థి పాతఛేర్మన్ శ్రీ పి. మస్తానయ్యకు 10 ఓట్లువచ్చాయి.

ఎన్నికకు అరగంట ముందువరకు నక్కా వెంచలయ్య చేర్మన్ అంటుండినారు. ఎమ్మెల్యే శ్రీ బల్లి దుర్గాప్రసాద్ అండతో, ఉదయకుమార్ తనను చేర్మన్ చేయకుంటే పోర్టుతిప్పేస్తానని బెదిరించాడట, వెంచలయ్యకు చేతికి నోటికి మధ్య పదవి జేజారడంతో కౌన్సిల్ హాల్లోనే బిగ్గరగా ఏడ్చేశాడట, పాపం,

కాంగ్రెసు కౌన్సిలర్లకు బలంలేదు, అవిశ్వాసంతో పదవి కోల్పోయారు; మళ్లీ ఇప్పుడు పదవు పోగొట్టుకోడానికి తప్ప పోటీచేయడం ఎందుకు?

### డాక్టర్ రాజగోపాలరెడ్డికి అమెరికన్ ఫెలోషిప్

డాక్టర్ ఇ. రాజగోపాలరెడ్డిగారికి Fellow of International Council of Sex Education and Parenthood లభించింది. వాషింగ్‌టన్‌లోని అమెరికా యూనివర్సిటీ ప్రధానంచేసిన ప్రతిష్టాకరమైన గుర్తింపు సభ్యత్వం ఇది.

సెక్స్‌విజ్ఞానంలో అర్హతను గుర్తించే సభ్యత్వం ఇది. అసలు సెక్స్ ఎడ్యుకేషన్ అనేదే మనదేశంలోని వైద్యరంగంలో చాల పరిమితంగా ప్రాక్టిస్ చేయబడుతున్నది. మానసిక వ్యాధులకు వలెనే దాంపత్య సంబంధానికి ప్రతిబంధకమయ్యే అపోహలను, భయసందేహాలను, భ్రమలను బోధనద్వారా తొలగించడం సెక్సు ఎడ్యుకేషన్ వైద్యప్రక్రియ ప్రత్యేకత. మానసికవ్యాధులకు మందులున్నాయి; కాని ఈ సెక్సు సమస్యలకు మందులేలేవు; కేవలం సెక్సుసుఖానికి దూరంచేసేమానసికమైన దుర్బలత్వాలను శాస్త్రీయమైన బోధనాపద్ధతులద్వారా తొలగించి మోడువారిన జీవితాల వసంతత్తింపదమే ఈప్రక్రియ, డాక్టర్ రాజగోపాలరెడ్డి ఇందులో విఖ్యాతులుకాదుకాని, ఐదారేళ్ళ అవిశ్రాంతమైన అధ్యయనం ద్వారా నిపుణులుగా సంగణనపొందారు.

ఈ సబ్జక్టులో డాక్టరేట్ పొంది విజయవంతంగా ప్రాక్టిస్ చేస్తున్నవ్యక్తి ఒకేఒకరున్నారు - ఆయనే బొంబాయికి చెందిన డాక్టర్ ప్రకాష్ కొఠారి; ఈ ప్రాక్టిస్‌లో ఆయన లక్షలు గడిస్తుంటారు. మనజిల్లాకు చెందిన డాక్టర్ రేగా నారాయణరెడ్డి సెక్స్ థెరపిస్టుగా అమెరికా అసోసియేషన్ సర్టిఫికేట్ పొందివున్నారు; ఆయన ఇటీవల నెల్లూరు డాక్టర్ల సమావేశంలో అంశంపై మీద ప్రసంగించారుకూడా.

డాక్టర్ రాజగోపాలరెడ్డి ఈ పాటికే యాభై కేసులను చేపట్టి చాలవరకు విజయులైనట్టున్నారు. ఈ వైద్య ప్రక్రియ డాక్టర్ ఓర్పుకు ఒక పరీక్షలాంటిది; కృషిమతోకూడినది.

విశిష్టమైన అంతర్జాతీయ కౌన్సిల్ సభ్యత్వాన్ని సంపాదించుకోగలిగిన డాక్టర్ రాజగోపాలరెడ్డిని అభినందిస్తున్నాము. రాజగోపాలరెడ్డి ఇప్పుడుగలిగిన డాక్టరుకాదు; కొన్ని అకళ్ళను మానవత కలిగిన మెండి మనిషి.



2 తేది సిద్ధాస్పత్రిలో రక్తదానం చేస్తున్న ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి, పెంకల తెలుగు యువత కమిటి సభ్యులు వర్తి రవీంద్రబాబు, ప్రక్కన డాక్టర్ మోహనరామరెడ్డి, సూపరింటెండెంట్ డాక్టర్ యానాదినాయుడు

సెక్స్ ఎడ్యుకేషన్ ప్రపంచమహాసభ మనదేశంలో ప్రప్రథమంగా నవంబరులో ఢిల్లీలో జరగబోతున్నది.

### ఏమిటీ బదలీలు?

నెల్లూరు సెంట్రల్ డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు అకుర్చీ అచ్చువాటు అవుతున్నట్లులేదు; కృష్ణారెడ్డిగారు వంద క్షరావికే పోయినట్లున్నారు; ఆయన తర్వాత వచ్చిన సోమశేఖరరావు రెండు నెలలకే బదలీ అయ్యారు; ఇప్పుడు ఆ స్థానానికి సింగూర్ ప్రాజెక్టులో వుంటిన శ్రీ ఎస్. వి. సుధాకరరావు నియమించబడి ఛార్జి తీసుకున్నారు.

ఏమిటీ సీటినియమంలేని బదలీలు? అసలు జిల్లాలోని ఇంజనీర్లను పలుకుబడి గలిగిన తెలుగుదేశం పెద్దలు ఒక్కొకరినిఒక్కొకరు తమ జేబుల్లో పెట్టుకొని వున్నట్లున్నారు; ఇంజనీర్లకు వారు కనదాలుగా వ్యవహరిస్తున్నారు. ఎస్. ఇ. గారుటా - నేరుగా బాబుకే బాధ్యతని వదంతి.

ఛీఛీ ఇంత్రవాదాలం ఉక్కిరిచవుకోటు తున్నదన్న కాంగ్రెస్ రాజ్యంలోకూడా లేదు.

### అడివినుండి బయటపడ్డారు!

రాజకీయ కీకారణ్యంలో చిక్కుకొని, వుద్యోగాలకు దూరమై, మానసికవ్యధలో వుండిన 29 మంది ఇంజనీర్లు జంగిల్‌ను క్లియర్‌చేసుకొని బయటపడినట్లున్నారు; ఎస్. ఇ. మొదలు జె. ఇ. లవరకు నిర్బంధంలో వుండిన వీరిలో కొందరు పదిహేనురోజుల క్రితం వుద్యోగాల్లో చేరినట్లున్నారు. న్యాయభిక్ష పెట్టింది.

ఉద్యోగాల్లో చేరినవారిలో కొందరు - ఎస్. ఇ. శ్రీ దుగ్గిరెడ్డి; ఇ. ఇ. బి. డి. రాధాకృష్ణారెడ్డి, వి శ్రీరాములరెడ్డి; ఎ. ఇ. లు - కె. వి రమణారెడ్డి, కె. శ్రీనివాసులురెడ్డి వగైరాలు వున్నట్లు తెలుస్తున్నది.

వీరికిసంబంధించి హైకోర్టుమొన్నాక తీర్పునిస్తూ, వీరికి అనాటినుండి పూర్తి జీతాలు చెల్లించవలసిందని, మూడు మాసాలలోగా వారిమీదవున్న ఆరోపణల మీద విచారణ పూర్తిచేయకుండా వుంటె వారు వుద్యోగాలలో వున్నట్లే భావించ బడాలని వెలిబుచ్చింది.

అంటే వీరు కష్టాలనుండి ఇంకా పూర్తిగా గట్టెక్కలేదనే అనుకోవాలి.

### సామూహిక వివాహాలు

శ్రీ సత్యసాయిబాబా 60 వ జన్మదినోత్సవం సందర్భంగా సత్యసాయి సేవాసంస్థ కులమత వర్గ వివక్షత రహితంగా, వారివారి మత సాంప్రదాయాను సారం పేదవారికి నవంబరు 3 లోగా సామూహిక వివాహాలు జరుపుతుంటది. దరఖాస్తులు ఈనెల 20 తేది లోగా శ్రీ వి.ఎస్. రామచంద్రరావు, నెహ్రూకోస్టు నెల్లూరు అడ్రసుకు పెట్టుకోవలసిందని డాక్టర్ ఎం. వి. కృష్ణారెడ్డిగారు ప్రకటిస్తున్నారు.

### గీతాజ్ఞాన యజ్ఞం

చిన్మయ మిషన్‌కు చెందిన స్వామిని శారదా ప్రియానంద, 10 నుండి 19 తేది వరకు టౌనుహాలులో భగద్గీతపై తెలుగులో ప్రసంగిస్తారు.

### స్వాతంత్ర్యయోధుని కాలధర్మం

గూడూరువాసి, స్వాతంత్ర్య సమరయోధుడు, జీవితాంతం ఖద్దరుధారి, కవి, సత్యప్రియుడైన శ్రీ అనపల్లి సుబ్బరామరెడ్డి (79) 2 తేది గాంధీగారి లక్ష్యం చెందారు. ఆయనకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు.

సుబ్బరామరెడ్డి 1940 లో వ్యక్తిసత్యాగ్రహంచేశారు; గెల్లిబేడాల శిక్షించలేదు; బహూశా ఛలో ఢిల్లీయాత్రలో ఆకనైరోజుల విశ్రాంతిలో ప్రవేశించబడినట్లున్నారు. సుబ్బరామరెడ్డిగారు రామాయణాన్ని కందాలలో వ్రాసినకవి; సాహితీపిపాసి.

### ప్రమాదాల్లో చావులు

కనకమహల్‌కు సమీపంలో 8 తేది ఉదయం 16 నెంబరు టౌనుబస్సు తంగవేలు ముసుస్వామి (24) అనే యువకుడ్ని ఢీకొన్నది; అతనక్కడికక్కడే చనిపోయాడు

అదేరోజు ఉదయమే వి ఆర్ కాలేజి దగ్గర ఒకలారీ, ఒక రిక్షాను గ్రుద్దింది; షేక్ ఖాదావలి అనే రిక్షాతొక్కనతను మరణించాడు.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 12.1 అ. |
| సర్వేపల్లి ,, | 3.25 అ. |
| నెల్లూరు చెరువు | 9.9 అ. |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | (3673) | 1700-00 |
| ,, | (3674) | 1750-00 |
| 2508 | (పాతవి) | 1400-00 |
| | (కొత్తవి) | 1300-00 |
| ఐ. ఆర్. 20 | | 1400-00 |
| ఐ. ఆర్. 50 (కొత్తవి) | | 1250-00 |



## • ఉత్తరక్రియలు •



గాంధేయవాది, కవి, సహృదయుడు

**అనపల్లి సుబ్బరామరెడ్డిగారు**

గూడూరు

2-10-85 తేది తన 80 యేట స్వర్గస్థులైనారు
వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ. ఉత్తరక్రియలు

**16-10-85 తేది బుధవారం నిలుపు**

**17-10-85 తేది గురువారం బ్రాహ్మణభోజనాలు**

గూడూరులో వారి స్వగృహమున జరుగును.

కుమారులు, కోడళ్ళు : అనపల్లి రాఘవరెడ్డి-శ్రీదేవమ్మ
,, జనార్ధనరెడ్డి-కాంతమ్మ
కుమార్తె అల్లుడు : బండి శ్రీనేతమ్మ-వేణుగోపాలరెడ్డి
మనమడు బండి భరత్ కుమార్



ఎం. ఎస్. రెడ్డిని సుదీర్ఘ సినీజీవితంలో తొలిసారిగా గెలుపుల పల్లకి ఎక్కించింది 'పల్నాటి సింహం': అది మోసిన కోయాలు కృష్ణ, దర్శకుడు ఎ. కోదండరామిరెడ్డి, జయసుధ, ఎ. ఎస్. ఆర్. స్వామి, శారద, రాధలకు ఆయన కృతజ్ఞతతో అక్షర సత్కార మందజేస్తున్న దృశ్యం.

# తెలుగు భాషావికాసానికి పదిలక్షల నిధి: ఎమ్మెస్ రెడ్డి వితరణ

వలువలోన కలదు పెన్నేటి గంగలు
మనసులోన కలదు మల్లెమాల

—డా. ఉందేల మాలకొండారెడ్డి

కార్యదీక్షయందు క్రమవర్తనమందు
దర్పణగౌరవపు సహజకవనమందు
వరద పొంగువంటి వాగ్వైభవమునందు
మధుర మేలి యశుడు మల్లెమాల

—మూదివర్తి కొండమాచార్యులు

కవిత్వం భావనలో ఉజ్జ్వలంగా దీపిస్తున్న మల్లెమాల సుందరరామిరెడ్డిగారికి వైదికశాస్త్రులతో షష్ట్యబ్ది పూర్తి మహోత్సవం గత 18 తేది మద్రాస్ కళ్యాణ హాలులో మహావైభవోపేతంగా జరిగింది. ఈ ఉత్సవానికి పలువురు చలనచిత్ర నిర్మాతలు, సినీ కళాకారులు, రచయితలు వచ్చి శ్రీ యం. యస్. రెడ్డిని అభినందించారు. ఇదివరలో తన సినిమాలకు దర్శకత్వం వహించిన కమలాకర కామేశ్వరరావుగారిని, సంగీత దర్శకుడు సత్యంగారిని, సినీ రచయిత రాజశ్రీగారిని మరికొంతమంది కళాకారులను శ్రీ రెడ్డి ఘనంగా దుశ్శాలువలతో సత్కరించారు.

ఈ షష్టిపూర్తి సభకు ప్రముఖ చలనచిత్రనిర్మాత విశ్వేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. ఓగాయిందు శ్రీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి, శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, తెలుగుగంగ స్పెషల్ కలెక్టరు శ్రీ కె. వెంకటశేషయ్య, డాక్టర్ ఉందేల మాలకొండారెడ్డి దంపతులు, డాక్టర్ అన్నజోస్యుల వెంకటసుబ్బయ్య, శ్రీ మూదివర్తి కొండమాచార్యులు పదస్సులో పాల్గొన్నారు.

శ్రీ ఎం. ఎస్. రెడ్డి షష్టిపూర్తి ఉత్సవానికి స్ఫూర్తినిచ్చిన పుస్తకం "మొగలిరేకులు" అనే ఉందేల మాలకొండారెడ్డిగారి కావ్యం ఆయన అంకితం పుచ్చుకోవడం, ఉందేల గొప్పతనం. "మొగలిరేకులు"లోని ఎన్నోగీతాలు వర్తితల్లో శాశ్వతముద్ర వేసుకుంటాయని శ్రీశ్రీ అభివందించిన ఉత్తమకావ్యం - కృతి స్వీకర్త శ్రీ సుందరరామిరెడ్డి కృతికర్త శ్రీ మాలకొండారెడ్డి పరస్పరం సంభావించుకున్నారు. ఈ సందర్భంలో శ్రీ మాలకొండారెడ్డి పతీమణికూడా మాట్లాడారు.

తెలుగుభాషావికాసానికై తాను అచిరకాలంలోనే పదిలక్షల నిధిని సమర్పిస్తానని, తనకు అరవైయేళ్ళు నిండుతున్న ఈరోజు అందుకు తొలిబోణీగా అరవైవేలు ఇస్తున్నాననీ, ఎవ్వరినీ అర్థించకుండా తన అభిలాషను తప్పక నెరవేర్చుకుంటాననీ ఆయన హార్దిక్యాలం సార్థ్య ప్రకటించారు. రెడ్డిగారి షష్ట్యబ్ది పూర్తి కార్యక్రమ పందాలుగా ఆయన సోదరులు డాక్టరు మల్లెమాల వేణుగోపాలరెడ్డి వ్యవహరించారు.

రెండుగంటలపాటు జరిగిన ఈ షష్టిపూర్తి సభ అపూర్వమనిపించింది. యం. యస్. రెడ్డి శక్తికిమించిన ఔదార్యం కల వ్యక్తి, తనజీవితం కళ్యాణమయం చేసుకోవాలన్న తపన. ఏదో ఒకమంచి పని చేసి మంచిపేరు సంపాదించుకోవాలనే ఆవేదన అయనకుంది. మెచ్చదగిన విషయమే మరి.

యం. యస్. రెడ్డి నిరాఘాటంగా, కమనీయంగా పద్యమూ, వచనమూ వ్రాయగల కొందరిలో ఒకరు.

కళ మీది మక్కువతోనే ఆయన చలనచిత్ర నిర్మాతగామారి ఇరవై ఏళ్ళనాడు మద్రాసులో అడుగుమోపాడు. తలకుమించిన భారాన్నే మోస్తూ ఆయన ప్రతుకులో బాగా అలసిపోయాడు. ఏనాటికైనా ఆ రంగంలోనే విజయం సాధించి తీరకపోతానా అనేగట్టినమ్మకం, మొండి పట్టుదల, కవితావ్యసనంతప్ప అన్యవ్యసనాలకు దాసోహం అనని వ్యక్తిత్వం, సాహసోపేతమైన వితరణ స్వభావం ఆయనున్న పరిశ్రమతో ఇంతకాలం నిలిపాయి.

పల్నాటిసింహం అఖండవిజయం సాధించడంతో అయన పొంగిపోయాడు. అది తన షష్టిపూర్తి దినమే తటస్థించడం విశేషం, అదృష్టం. అరవై ఏళ్ళ తర్వాత ఆయన దశ తిరిగిందనిపిస్తుంది.

జీవనప్రవంతి సుఖదుఃఖ మిశ్రితం. అరెంటికీ ఎవ్వరూ వీలుకదనుండరు. ఈ నిజంతెలిసినవ్యక్తి ఒడిదుడుకులు ఏర్పడినప్పుడు క్రుంగిపోకుండా ఉత్తమ జీవితలక్ష్యం సాధించేవరకూ విశ్రమించదు. ఇది స్థితప్రజ్ఞుని లక్షణం. ఈ లక్షణాలు బాగా ఒంటబట్టినవ్యక్తి శ్రీ సుందరరామిరెడ్డి మంచి మనసున్న మనిషి. చలనచిత్ర రంగంలో బాగా అనుభవం గడించారు. వారు ముమ్ముందు మన సంస్కృతికి అద్దంపట్టే సందేశాత్మకాలైన మంచిచిత్రాలు తీయాలని, ఆ మార్గంలో ప్రగతిసాధించాలని, అందుకు మరో ప్రతివారి షష్ట్యబ్ది చక్రభ్రమణాన్ని వారు సుందరంగా దర్శించాలని ఆశిద్దాం.

—మా. ప్ర. వి.



షష్టిపూర్తి కళ్యాణ జంట - ఎమ్మెస్‌రెడ్డి, సౌభాగ్యమ్మ

# 'కమల్ రెండో పెళ్లికి ఒప్పుకోను'

"ఇతడు పుట్టలోనే చిత్ర కు కమల్ హాసన్ తండ్రి" అని ఇటీవల హిందీ పత్రిక ప్రకటించిన విషయం పెద్ద సంచలనం కలిగించింది. కమల్‌హాసన్ గృహంలో దుమారం చెలరేగించింది. "నేను మేకప్ ప్రక్రియలో శిక్షణ పొందడానికి రెండేళ్లకుముందు అమెరికా వెళ్ళవలసి జరిగింది గొడవంతా. అక్కడ నుంచి నేను స్వదేశానికి తిరిగొచ్చాక ఒకసారి నార్త్ కమల్ ఏదో హిందీ చిత్రం షూటింగ్‌కు బొంబాయికి వెళ్తే కూడా నేనూ వెళ్లా. హోటల్ 'హాలిడే ఇన్'లో మా బస. అప్పుడక్కడ గుసగుసలు వినిపించాయి నాకు. కొంతకాలం క్రితం కమల్ అపోలోల్లో నటి సారికతో గడిపాడని వాళ్లంతా చెప్పుకోవటం నా చెవిన పడింది. వెంటనే కమల్‌ను నిలదీసి అడిగాను. 'అంతా అబద్ధం. ఎవరో గిట్టనివాళ్ళు పుట్టించిన పుకారు' అన్నారాయన. అయినా, నాలోంచి అనుమానం తొలగిపోలేదు. ఒకరోజు నేరుగా సారిక ఇంటికే వెళ్ళాను. నన్ను చూడగానే అనిత దిగ్భ్రాంతురాలైంది. బాగా చివాట్లుపెట్టాను. 'నువ్వు ఏం అనుకొని మావారిని బుట్టలో వేసుకున్నావ్? ఆయన్ను పెళ్ళిచేసుకోబోతున్నావా?' అని అడిగేశాను. 'నాకు అటువంటి దురుద్దేశమేమీలేదు ఏమైనా అడగాలంటే మీ ఆయన్నే అడుగు' అంది సారిక అంతటితో ఆమెను వదల్లేదు; మేం బసచేసిన హోటల్‌కు లాక్కొచ్చి 'కమల్ చెప్పు. మా సంసారంలో చిచ్చుపెడ్తావా'? అని మండిపడ్డాను 'ఆయనకు నామీద మోజు. దానికి నేనేం చేయను? మిమ్మల్ని విడదీసే తలంపేలేదు.' అంది సారిక 'ఏమైనా జాగ్రత్తగా వున్నావో. పిచ్చిగా గుణపాఠం నేర్పుతా నాకు తెలుసు' అన్నాను అంతే ఆమె ఏడుస్తూ వెళ్ళిపోయింది. మొత్తంమీద కమల్‌కు నేనంటే ఎంతో ఇష్టం. నన్ను వదలి ఉండలేడాయన. నేను అమెరికా వెళ్ళినపుడుకూడా ఆయన హడావుడిగా అక్కడికొచ్చి నన్ను చూశారు. అంత ప్రేమున్న మా ఆయన నామీద ఉందుచేత, ఆయనామెను ద్వితీయకళత్రంగా స్వీకరించడనేదిమాత్రం నిజం.

—కొరవ శివ పేటీలో



'...' అక్కినేని ... నో ... త్తికి భవాని బహూమతి అందజేస్తున్న యువనటి అహల్య. మంత్రి రామరెడ్డి

# ఇకనుంచి వారానికి రెండే సినిమాలు!

ఒకవారంలో రెండు సినిమాలకు మైన విడుదలచేయకూడదని దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్యమండలి తీర్మానించడం జరిగింది. సంక్రాంతి, దీపావళి పర్వదినాలలో మాత్రం నలుచిత్రాలవరకు విడుదల చేయవచ్చునని, సెన్సార్ సర్టిఫికేట్లు పొందిన నెంబర్ల ప్రకారం విడుదలచేయాలని సంపిణీదారులు, థియేటర్ల యజమానులు నిర్ణయించారు. ఇది సక్రమంగా అమలు జరిగేలా చూడడానికి ఒకచిన్న సంఘం కూడా ఏర్పాటైంది. దీపావళినుంచి ఇది అమలులోకి వస్తుందట. ఉగాదినాడు 6 చిత్రాలు కనిమ్మా పండుగరోజుల్లో 4 చిత్రాలు విడుదల చేయవచ్చునని. ఐతే అవారంలో మళ్లీ కొత్తచిత్రాలు విడుదలవకూడదని ప్రతిపాదించబడింది. కొన్ని యేళ్ళక్రితం ఇదేవిధంగా దక్షిణ భారత చలనచిత్రమండలిలో కొన్ని నిర్ణయాలు తీసుకొన్నా - నిర్మాతలలో ఐకమత్యం లేనందువల్ల ఏదీ అమలు జరగలేదు. అసలు నిర్మాతలలో సఖ్యతఅని ఒకటుంటే, తారలరేట్లు అకాశమంతెత్తుకు పెరిగేవికావు. ఎన్నో సమస్యలను అవలీలగా పరిష్కరించుకోడానికి వీలయ్యేది. ఇప్పుడుమాత్రం ఏమవుతుందో వేచిచూద్దాం.

# 'ఆకలి బాధ'తో ఆస్పత్రిపాలైన దీప

అసలు స్థూలకాయం రాకుండాముందే జాగ్రత్తపడాలి; మితాహారం, కాస్తో కూస్తో శరీరవ్యాయామం - ఇవి కొందరు తారలు నాజూకుగా వుండడానికి తీసుకునే జాగ్రూకతలు. లావుతగ్గడానికి ఇటీవల నటి దీప కొన్నిరోజులపాటు ఉపవాసం వుండడమేకాక వున్నట్టుండి విరీతంగా శరీరవ్యాయామం చేసేసరికి అమాంతంగా సొమ్మసిల్లి పడిపోయింది. వెంటనే ఆమెను విజయా హాస్పిటల్‌లో చేర్పించారు. క్రమక్రమంగా కోలుకుంటోంది.



# 'కేసు తేలేదాకా సినిమాలు లేదు'

నాలుగున్నర మాసాల కారాగార బంధన అనుభవించిన అనంతరం జామీనుమీద నటుడు సుమన్ విడుదల చేయబడ్డాడు; మద్రాసుకు దూరంగా మధురైలో ఉంటూ, అక్కడి పోలీస్ స్టేషన్‌కు ప్రతిరోజూ ఉదయం పదిగంటలకు వెళ్ళి సంతకం పెట్టాలని ఆదేశించబడ్డాడు. "గూండా నిరోధక చట్టం ప్రకారం ఖైదు చేయబడ్డవారు కనీసం ఏడాదిపాటు జైలుశిక్ష అనుభవించవలసిందే. నేను అనుదినం పూజించే శ్రీ సాయిబాబా కటాక్షంవల్లే జామీనుమీద విడుదల కాగలిగాను. మధురైలో ఒక ఇంటిని అద్దెకు తీసుకున్నాను. ఇద్దరు ముగ్గురు స్నేహితులు నాతోపాటు ఉంటారు. ఆ నగరంలో నాకు తెలిసిన మిత్రులు చాలామంది ఉన్నారు. నాకు తగు రక్షణగా ఉండే చోట ఉంటాను. మధురైలో నాకోసం ఏ నిర్మాతా షూటింగ్ పెట్టుకోడానికి వీలుండదు, ఎందుకంటే, ఈ పరిస్థితులలో నేనెలా నటించగలను? జైలులో ఎన్నో గంటలపాటు ధ్యానంచేసి, అలసి యాను. మధురైలో ఉన్నంతకాలం బాగా విశ్రాంతి తీసుకుంటాను. మూడురోజులపాటు మద్రాసులో నేను మొక్కుకున్న ఆలయాలు దర్శించాక మధురైకి బయలుదేరుతాను," అని సుమన్ విలేకరులకు తెలియచేశారు. ఈయన జైలునుంచి విడుదల చేయబడ్డప్పుడు స్వాగతమివ్వడానికి మద్రాసు సెంట్రల్‌జైలువద్ద గుమికూడినవారిలో నిర్మాతలు, సుమన్ తల్లి ఉన్నారు.

# ఆరుద్ర ఎవరో తెలియదా?

షావుకారు జానకి విద్యాధికురాలు. తెలుగు, తమిళ, కన్నడం, హిందీ ఆంగ్లభాషల్లో అనర్గళంగా ఉపన్యసించి సభికులను ఆకట్టుకోగల బహుముఖ ప్రజ్ఞావంతురాలు. విజయవాడలో సెప్టెంబరు 22న ఆరుద్ర షష్టిపూర్తి అభినందన సభ ఏర్పాటు చేయబడింది. అప్పుడు నాగార్జున యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ రాజా రామమోహనరావు ప్రసంగిస్తూ, "ఆరుద్ర గురించి నాకొద్దే తెలియదు. ఇటీవల నేనేదో సినిమాలో ఓ నటిని చూసి ఆమె ఎవరని మా ఆవిడను అడిగాను. ఆమెపేరు షావుకారు జానకి అని మా ఆవిడ చెప్పింది. అంతకుతప్ప ఆమె గురించి కూడా నాకేమీ తెలీదు," అన్నారు. ఆ తర్వాత ఉపన్యసించిన షావుకారు జానకి "వైస్ ఛాన్సలర్ గారికి నా గురించి తెలియక పోవడంలో వింత ఏమీ లేదుగాని ప్రముఖ సాహితీవేత్త, కవి పండితుడు పరిశోధకుడు అయిన ఆరుద్రగారి గురించి తెలియక పోవడం విడ్డూరమేమరి" అని సమాధానం చెప్పి, సభికుల కరతాళధ్వనులను అందుకుంది! యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌లాంటి గొప్ప హోదాలో ఉన్నంతమాత్రాన ఇతరుల గురించి అంత తక్కువగా అంచనా వేయరాదని ఆ రోజు ఉపన్యాసం ద్వారా రామ్మోహనరావు ఈ పాటికైనా గ్రహించే ఉంటారు.

# జిల్లా వార్తలు

(5వ పేజి కొరవ)

శ్రీ టి. బ్రహ్మయ్యను నియమించారు; అక్కడుండిన శ్రీ టి. పార్థసారథి వెంబడే వెళ్ళారు.

## పెదబ్బీపురం

## కల్వర్టు కుంభకోణం?

ఆత్మకూరు తాలూకా పెదబ్బీపురం చెరువుఉంది, దీబ్బీపురం చెరువుకు కొత్తగా కాల్వకు కట్టిన కల్వర్టు నాసిరకంగా వుందని గ్రామస్తులుచెప్పుతున్నారు. ఈ రెండింటిమధ్య అప్రోచ్ రోడ్డు. కల్వర్టులకు ఒక పెద్ద యూస్వామి కాంట్రాక్టు తీసుకున్నాడట. కల్వర్టుకు కావలసినరాయిని, చెరువుకట్టమీంచి తీసి వేసి తెర్చారట, సిమెంట్ వాడకం చాలాక్వల్పమట, అసలు కట్టడమే ఎస్టిమేషన్ ప్రకారం జరగలేదట చెరువు నుంచి నీరు వానాకాలం ఉధృతంగావస్తే కల్వర్టు మొత్తం కొట్టుకొనిపోయేట్టుదని. ఇంత నాసిరకంగా వున్నందువల్లనే దానికి బిల్లు ఇవ్వడానికి ఒక ఇంజనీరు నిరాకరిస్తే. అతన్ని బదలీ చేయించారని చెప్పారు.

ఎస్. ఇ. గారు ఒకసారి పరిశీలించడం బాగుంటుంది.

## కలిచేడు

## బస్సుప్రమాదంలో మృతి

వెంకటగిరి- పొదలకూరు బస్సు కలిచేడు దగ్గర 6 తేది ఉదయం ఒక విందు ప్రాదాన్ని ఎదుర్కొనుకున్నది. ఉదయం 10 గంటల ప్రాంతంలో, రోడ్లో నిలబడి వుండిన పీరా సాహెబ్ అనే యువకుడి పైకి బస్సు ముందుచక్రాలు ఎక్కాయట; అతడక్కడికక్కడే చనిపోయాడు.

## చిన్నచెరుకూరు

## చిత్రపటావిష్కరణ

ఇందుకూరుపేట తాలూకా చిన్నచెరుకూరు ఉ. వ. హైస్కూలులో 2 తేది, గాంధీజయంతి సందర్భంగా, స్వర్గీయ రామరాఘవరెడ్డి చిత్రపటం ఆవిష్కరించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఎమ్మెల్యే శ్రీ కె. వి. సుబ్బారెడ్డి, జి. వ. అధ్యక్షుడు డాక్టర్ బాలచెన్నయ్య, సమితి అధ్యక్షుడు శ్రీ ఆనం భక్తవత్సలురెడ్డి ఈ సభలో ప్రసంగించారు. హెడ్మాస్టరు శ్రీ టి.వి. సుబ్రహ్మణ్యం స్వాగత వందనాలు చెప్పారు.

## వెంకటగిరి జాతరలో

## అపస్వరాలు

వెంకటగిరి జాతరలో ఈసారి పలు అపస్వరాలు పల్కాయి; అపచారం జరిగిందనేభీతిని భక్తులలో కల్గించాయి.

పోలేరమ్మ విగ్రహాన్ని ఏఏటికాఏడు కొత్తమట్టితో చేస్తారు. అందువల్ల చాలా సున్నితంగా, జాగ్రత్తగాచూసుకుంటారు; కాని ఈ ఏడాది జాతరలో విగ్రహాన్ని వుంచిన చప్పరంపైకి జనం తోసుకుని ఎక్కారట. ఆ తోపుడుతో విగ్రహం తల విరిగిపోయింది. వెంటనే పైపైన సర్దారుకాని, కొంతసేపటి తర్వాత మళ్ళీ తల పూర్తిగా వాలిపోయిందట.

ఈ జాతరలో ఇప్పటివరకు ఇటువంటి సంఘటన జరిగిన సాక్ష్యమే లేకపోవడంతో వెంకటగిరీయులు తమ గ్రామానికేదో అరిష్టం దాపురించిందని భీతిల్లుతున్నారు.

## ఇందుకూరుపేట పశుశిబిరం

నెల్లూరు రోటరీక్లబ్ ఇటీవల ఇందుకూరుపేటలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించింది. 160 పశువులకు చికిత్స, 20 పశువులకు శస్త్రచికిత్స చేశారు. సాయంత్రం దూడల ప్రదర్శన జరిగింది.

చిన్నసభ- శ్రీ కుంగువాడ సత్యనారాయణ అధ్యక్షించారు. శ్రీ వై. బి. రెడ్డి, శ్రీ గునుపాటి సుబ్బరామరెడ్డి, పశువుల అసిస్టెంట్ డైరెక్టర్ శ్రీ కృష్ణమాచార్లుగారు.

## ఆత్మకూర్లో వాన

ఆత్మకూరు తాలూకా అంతా 5, 6 తేదులలో వర్షంపడింది. దీనివల్ల కరువు తీరకపోయినా, మంచినీటికొరత తగ్గింది.

## అనంతసాగరం

## "ఆరోగ్యదేవోభవ"

ఆత్మకూరు తాలూకా అనంతసాగరం ఆరోగ్యకేంద్రం సిబ్బంది గాంధీ జయంతిరోజు 'ఆరోగ్యదేవోభవ' అనే కార్యక్రమం జరిపారు. సప్వాలపాడు సూపరింటెండెంట్ - శ్రీ ఎం, సుబ్బారెడ్డి అధ్యక్షించారు. ఎమ్మెల్యే డాక్టర్ వి. సుందరరామరెడ్డి, డాక్టర్. టి. కన్నయ్య శ్రీ ఇందూరు యానాదిరెడ్డి. హెడ్మాస్టరు శ్రీ పి. హెచ్. ప్రసాదరావు తదితరులు మాట్లాడారు. శ్రీ వై. సుబ్రహ్మణ్యం వందనాలు చెప్పారు.



## ● శ్రద్ధాంజలి ●



మా మిత్రుడు

యం. కొండయ్యరాజు

చనిపోయి 7-9-85 కు సంవత్సరం నిండింది

16-10-85 తేది

ప్రథమవర్థంతి సందర్భంలో

వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి.

వారి కుటుంబానికి మా సానుభూతి

మిత్రులు : బి. మురళి, బి. వి. చలపతి, వి. రామచంద్రయ్య

వై. బాబురావు.



Edited, Printed & Published by N. Sree Ramamurthy, Printed at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)